ఓం

శ్రీహయగ్రీవాయనమః.

# హారంగదు

( ధార్మికోద్బోధనము )

రచయిత

N. Ch. టి. శ్రీరంగాచార్యుడు.

మొదటికూర్పు

200

శ్రీవైష్ణవవిద్యార్థిసంఘపక్షమున,

శ్రీనివాసముద్రాలయమందు ముద్రింపబడియె.

1944

వెల: 0-2-0

మహాశయులారా!

నేను వ్రాసినజీవితచరిత్రలలో ప్రథమమందు నా మిత్రుని పవిత్రజీవితచరిత్ర రచించి ధన్యుండనైనాను ఈగ్రంథరచనకు ప్రోత్సహించి, సర్వవిధములసాయముసల్పిన, సద్బ్రాహ్మణుండగు, ఓలేటి నరసింహాచార్యులగారికి ఆ ఈశుఁడభివృద్ధి గాంచుటకై తోడుపడుగాక! ఇందుండు తప్పులనుగాని. దోషములనుగాని సోదరభావమున నాకు తెలిపినచో, ద్వితీయముద్రణయందు సవరించుకొందును.

ఇట్లు

గ్రంథకర్త.



---

గమనిక: ఈగ్రంథమునకు, మ. శ్రీ. గండే నారాయణగారు, రు. [౧౦] నొసంగినారు. అందుకు ఆ మాధవుఁడు; వారి కుటుంబాభివృద్ధి చేసి, ఆయురారోగ్య సంపదలిచ్చుగాత?

వులవలెనే మనకుగానరావు గాన, శాశ్వతసంతోషయుక్తమైన మోక్షముబొందుటకు ప్రయత్నింపవలయును. అందేవన; ప్రతినిత్యము అరుణోదయకాలమున లేచి, ఈశ్వరుమనసా వాచా కర్మణా ఐదునిముసములకాలము ధ్యానించి, భగవద్భక్తిపరుడై యుండి భానోదయమైనతర్వాత భగవద్గీతాదిగ్రంథముల చదువుకోవలయును. మళ్లీ భాస్కరాస్తమయమైనతదుపరి పైదినము సంధ్యావందనాది భగవద్భజనలో కాలముగడుపవలయును. అసత్యమెన్నటికి నాడకూడదు. ఆకర్షించుటకై రాజస తామసపదార్థములపై దృష్టినుంచుకొనవలయును

శరీరాభివృద్ధియేగాక ఆత్మోన్నతికావలయునన్న కొన్ని నియమముల పాటింపవలయును. గాన, ఈక్రింది యంశముల పాటించువ్యక్తి, యిహపరములందు సౌఖ్యానందములనొందును

(1) సత్యావదా– [2] సత్యమును మనోవాక్కాయములచే తెలుపువారు ఉత్తములగుదురు. [3] సత్యముగట్టిద, దానిఫలితము మధురము; దానిని మనసారగోరవలయును. (4) స్వప్నమందైనను, హాస్యమునకైన నసత్యమాడకుము. [5] సత్యమే ఈశ్వరస్వరూపము. [6] సత్యవ్రతులకే సర్వేశ్వరుడు కాన్పించును. (7) నారాయణుని భక్తితో పూజింపుము. [8] ఈకలియుగమందు ప్రపత్తియొక్కటియే మానవులకు సులభసాధ్యమగు భక్తిసాధనము. (9] [illegible]కారాధనచే

మోక్షము లేదు. [10] ఈశ్వరుని శాసనగ్రంథములు వేదములు వాటినియమము లాచరింపుము. [11] తైలవిరహితజ్యోతి వెలుగనిరీతి, భక్తిలేనిమానవుడు తరింపజాలడు. [12] మనశ్శుద్ధి కలిగి ఈశ్వరుని ఆరాధింపుము. 13 భగవద్భక్తి, సత్పురుషుల సేవ మోక్షమునకు ముఖ్యసాధనములు. 14 భగవంతుడు; నిత్యానందస్వరూపుడు. భక్తిగలవానికి అతిసుందరరూపముతో నేకాన్పించును 15 పరేశ్వరునిమీద నమ్మకముంచుము. నాస్తికత్వమునాశనమునకు కారణము. 16 స్థావరజంగమాత్మకప్రపంచమందు భగవంతుడున్నాడనుభావమే భాగ్యమైనది. 17 భగవంతుడు ఆర్తత్రాణపరాయణుడు; ఆదిమధ్యాంతరహితుడు. 18 పామువంటిది పాపము; ఆశ పిశాచము వంటిది. 19 కామ నాఖములనెడు కురంగములను సంసారమను అరణ్యమధ్యమున విడుచుము. 20 అగ్నికన్న మించినది దుఃఖము: అగ్ని శవమును మాత్రమే కాల్చును. కాని, దుఃఖము తనజీవితసర్వస్వమును నశింపజేయును. 21 మానవశరీరము చీము, రక్తము, మాంసము, ఎముకలతో కూడుకున్నదశాశ్వతమని యెరుంగుము 22 పరసతీగమనమునకై కామోద్రేక మొనరించి జీవించుట కన్న, కటికవాని కఱుకరవాలముక్రింద తలవంచుట మేలు. 23 జిహ్వాచేయుపాపములు నాలుగు. అసత్యమాడుట, ఒకనిపై నేరము లారోపించుట, దురాలాపము లాడుట, అనర్థవచనములుపలుకుట. 24 పరస్త్రీగమనము, చౌర్యము, అభక్ష్య

అతని వాతావాహతిచే అతనికి కీడుగలుగక, పాపము! పుణ్యపురుషునకే తగిలి కీర్తిశేషు డగుచున్నాడు ఈశ్వరుడుకూడా ఇట్టివారిని ఉంచడు. ఏలనన అతనిచే కలుగు సంతానము పుణ్యసంతానము కానివ్వండి? కాని, ఇతను పాపసహిత సంసారనౌక నడిపించుతూ ఉండుట సహించక పుణ్య పురుషులను, పాపీచిరాయుః సుకృతీగతాయుః అన్నట్లు తనుగామే గ్రహించును. కాని, అతనికీర్తి ఎల్లప్పుడంతోషమాన చంద్రికవలె ప్రకాశించుచుండును అతనిచే చేయబడిన ధర్మకార్యములు మార్గదర్శకములై తోవచూపించును. ఆవ్యక్తిచే సల్పబడిన సుద్గ్రంథ పఠనచే ధర్మాచరణ గుణముల గలుగజేయును. ఆ దివ్యపురుషుని దేశసేవ అన్నివిధముల సోదరులకు చేయూత నొసంగుచుండును. అట్టి దివ్యపురుషుల చరిత్రలం బఠించి ధర్మాచరణ మానవజీవితములో సల్పు వ్యక్తి సత్పురుషత్వవిశేషాది గుణపూర్ణితుడై విద్యుచ్ఛక్తివలె ప్రకాశించుచుండును.

## వంశవివరణ.

శ్రీ మహాప్రతాపరుద్రదేవ పాలితంబైన. ఓరుగల్లుకు కొలదిదూరముననున్న, "వేలుపుగొండ" ఆనాయకుని పితామహుని నివాసస్థానము; శ్రీమద్భాగవత గ్రంథకర్తయగు, పోతన దేశమిచ్చుటకు సమీపము. జాత్యైన దూదేకులనైన ధనాచే, చేయబడిన ధర్మకార్యములు, కట్టించిన ప్రాచీనభార

తీయుల శిల్పచాతుర్యమై పుణ్యతమ, నిరూపించు కోటలనుగలిగిన ఆ దేశము పుణ్యదేశము. ప్రహ్లాదుని రక్షించి, అతనికి ధర్మోపదేశముల సల్పి వెలసిన లక్ష్మీనృసింహస్వామి క్షేత్రమది; అందుందు హరితవర్ణ కదంబ వృక్షములు, అచ్చటచ్చటనున్న నిర్మల శీతలోదక ప్రదేశంబులు, దర్శింప ప్రకృతి స్వాశయమాశ్రయింప బడుచుండును. అందుందు వానరములు పురాతన కోటలలో తిరుగునపుడు పూర్వపు రామాయణ దర్శ్యమగును.

ఇట్టిప్రదేశమున సకల పవిత్ర చరిత్రుండగు ఆత్రేయ ఋషిగోత్రజుండు ఋగ్శాఖ, మతము విశిష్టాద్వైతము; పేరు రామస్వామిగారు; ధర్మపత్ని నామము లక్ష్మీనరసమాంబ, అతనికిగలిగిన సంతానము మోఘము; "అపుత్రస్యగతిర్నాస్తి" అను వాక్యమతనియెడ సార్థకముగాక, ప్రాచీనకాలమందు దన కాంతిమూర్తి దుష్టశిక్షణ శిష్టరక్షణ సల్పి తన చరిత్రను సువర్ణాక్షరములచే లిఖింపబడి ప్రఖ్యాతిగాంచిన శ్రీరామ సంతానమే మన రామస్వామిగారి సంతానము. కుశలవులంబోలు నిద్దరు కుమారుల గనియెను. ప్రథమ కుమారుని పేరు. లక్ష్మీనృసింహాచార్యులు, తమ స్వామి పేరు పెట్టుకొనిరి. రెండవ కుమారుని పేరు జగత్ప్రఖ్యాతి గడించి స్వదేశీయుల చేతనేగాక పరదేశీయులచే నాదరింపబడి, భాష్యకర్తలలో నగ్రస్థానమొందిన లక్ష్మణాచార్యులని తమ ద్వితీయ సుతుని నామ మిడిరి. [రామానుజుల పేరే లక్ష్మణాచార్యులు] ఏవు కాదుహాంద్రగని

అనేక సుగుణవిశేషములచే వలరారుచుండెను. అతని సువిశాల హృదయము ప్రధానముగా దయతో పూర్ణమయ్యెను. గోసంరక్షణ, పక్షులయెడలచూపు నుదారభావ మతని చిన్ననాటి నుండియే ఏర్పడుచుండెను.

## వస్త్ర స్వీకారము.

ఆర్యావర్త మన్నివిధముల అఖండ దేశక్షేమహితమైనదియై యొప్పారుచున్నది. ప్రాచీనకాలమందుండు ప్రజలజ్ఞులుగను. అనాగరికులునుగారు. స్వీయభాషను వదలి, పరభాషాజ్ఞానసాధన చేసుకొని వారికి టింగోకూడా ప్రాచీన మాతృభాషగాక, పరభాష మాతృభాషగా భావించనంతమాత్రమున వారజ్ఞులుకారు; సరికదా! స్వదేశీయ వస్తునిగ్రహణ, పరదేశ వస్తుస్వీకరణ, లేనంతమాత్రమున వారు వస్త్రహీనులుగను. అనాగరికులుగను కారు. వారుతమధర్మాచరణయందు నిమగ్నులై ఉత్కృష్ట స్వభావనతో వారికి దైనసమాజము లన్నివిధముల బాగుగా నుండెను. ఆత్మయును తత్వము పూర్వజన్మము, పరజన్మము స్వర్గము, నరకము, కర్మఫలము, పితృదేవతారాధనకై పుత్రుడొసంగు పిండతర్పణములు, పుత్రోత్పత్తితో పున్నామనరకములేక పుణ్యములబ్బుచుండును విశ్వాసముతో మనభారతదేశము ప్రఖ్యాతిజెందినది.

తత్కారణముననే మనదేశమందు, పాశ్చాత్యదేశముందువలె విడాకులుగాని, అధర్మకార్యములుగాని లేక నిప్పు

గ్యా దేశము అదర్శప్రాయత్వసిద్ధి నొందినది. ఏకశిలానగరమం దుండు "ఓలేటి లక్ష్మీనృసింహాచార్యుల" వారు పూనకథానాయకునితండ్రి కడకువచ్చి, పుత్రవిహీనమునగలుగు ఫలితము మన ముఖోనుంచుకొని 'తేపుత్రం మమదీయతాం' అనియడుగ "పరోపకారార్థమిదంశరీరం" అనిభావించి తననుపెంచిపెద్ద చేసి అతనితో కొంతపనియవునని భావించిన, ఆవ్యక్తి యింకొకవి కుటుంబాభివృద్ధియవునని తలచి అతను "లక్ష్మీనృసింహాచార్యులు" మరియు నతనిభార్య 'రంగమాంబ' గారు దత్తు నొసంగి స్వార్థపరిత్యాగనిరూపణ సల్పెను.

## ఉపనయనము.

సనాతనులు ప్రపంచాదర్శప్రాయత్వసిద్ధినొంది, పెక్కు పురాణగ్రంథముల రచించి, మార్గదర్శకులై, తమధర్మశక్తిచేస్థాపనచేసినమాహాత్మ్యము వారిబ్రహ్మచర్య బలమే. అట్టివ్రతదీక్ష చేపట్టని గహణ, క్రోధాదిదుర్గుణముల నడంచుకొని, సుప్రసిద్ధి నొందినారు. అష్టవర్షప్రాయముగలిగిన వ్యక్తి దీక్షితుడు. పాతిక వత్సరముల వరకు యీ వ్రతదీక్ష యుండును. అట్టి ఆశ్రమస్వీకారమునకు ముందు ఉపనయనముసల్పి గురుకులాశ్రమమునకంపుదురు. అరీతిగనే మారంగనికి ఉపనయనము, దత్తుమాతాపితలు సల్పిరి. లోకములో స్వీయతలిదండ్రుల విడచినట్లయితే పోయినప్రదేశమున నున్నవారిని చిరాకుపరచి, వారలవిసిగించి స్వాస్థి చెప్పుదురు; కాని యితనట్లుగాదు. దత్తునకు ధనముదొ

రీతి నెంతసంతోషముగునో, అల్లాగే మారంగని తలిదండ్రులు సంతోషముగాంచుటయేగాక, వెళ్లిన రెండుసంవత్సరములలో నూతనగృహనిర్మాణ మయ్యెను. అతనన్నివిధముల వారికిగృహాంతర్భాగమున నున్న గోడవలె సహాయముసల్పుచు ఆనందడోలికలందు నూగించుచుండెను.

## యాత్రాగమనము.

అది శరదృతువు. శీతకాలము; అట్టికాలమందు శ్రీరంగాది క్షేత్రములందు ఉత్సవదినములు; కావున, మన శ్రీరంగడు యాత్రానిమిత్తమై దత్తతలిదండ్రులతో బయలు వెడలెను. ప్రథమమున హైందవులకు పుణ్యప్రదేశమై నైసర్గికదర్శనమునకు స్థానమై మన కన్నివిధముల శృంగారప్రబోధముసల్పు, శ్రీరంగక్షేత్ర శ్రీరంగనాథుని పాదపంకజములను మారంగడు సందర్శనముసల్పి సత్పురుషు డయ్యెను. పెన్నరంగని శ్రీపెరుంబూదూరు శ్రీభాష్యకారుల దర్శించి, వైష్ణవమతప్రవిష్టత్వముచే భాగ్యుడాయెను. నగరములలోకెల్ల నగ్రస్థాన మని అలరారుచున్న కంచీవరదుని సేవించి యుత్తము డాయెను. మధుర అనంతశయనము సేతువును సందర్శించి సద్ధర్మాచరణీయు డాయెను. తిరుపతి. తిరునారాయణపురము తిరిగి వెంకటవరదనారాయణులంగాంచి. వారినామోచ్చారణమున యుత్తమోత్త్వ సిద్ధినొంది సరసు డాయెను. మలబార్ మొదలగు పట్టణముల సంచారము చేసి, నాగరికతను తెలుసుకొని సంతోషహృదయుం

డైన మా రంగడు నాలోక ఆదర్శపాత్రయును. ఇన్ని పుణ్యక్షేత్ర దర్శనావిశేషముచే నతను దైవజ్ఞుడని భావింప వచ్చును. ఈరీతిగా నతడు ఒకవత్సరము గడపెను.

## వివాహము

ఇటీవల భావించిన ముప్పది వత్సరములు ఆయునప్పగాను. భారతీయులు పల్పు కార్యక్రమము లన్నికూడా తగినున్నవి మా రంగనికి (౨౬ సంవత్సరములకే, వేదాంతవిద్యా శిరో అనరవాది నెరకలనరని మహాచార్యులవారి ద్వితీయ పుత్రికతో వివాహమాయ్యెను. అట్టి సందర్భములో అతనిని, అతని భార్య భార్యయగు లక్ష్మీనారాయణిని గాంచి సంతోషించని వారెవరు? సైనరీతిగా నా వ్యక్తి జీవితములో నాచరణ చేయుచుండెను. పిదప, నోముకల రీతిగా ఆ భార్యాభర్తలు మహా తృప్తితో నుండిరి. కొన్ని నెలలు గడచిన తరువాత అతడు కార్యక్రమము మొదలిడెను. సీతారాం బాగ్ హైదరాబాదున ఒక ఉపవనమున్నది. అచట "శ్రీశఠగోప రామానుజాచార్యుల" వారు ఆచార్యులు. సాతాని రామానుజాచార్యులు. సమస్త శాస్త్రములు సంపూర్ణముగా జదివి, యువ్వల మత పాండిత్యవిశారదత్వము కలిగిన పండితప్రదేశమది. అచటనే మన రంగడు సంస్కృతాంధ్ర ద్రావిడ భాషల నభ్యసించెనో లేదో, సంఘప్రచారము మొదలిడి గ్రంథరచన ప్రారంభము చేసెను. అతను రచించిన గ్రంథములలో ధర్మకోద్బోధనము మరియు నితర

పుస్తకములు అముద్రితములో నున్నవి. దానిలోనుండు కవితాలక్షణములను, భావగాంభీర్యమును ఈ క్రిందివ్యాసమే యుదాహరణము.

“ధార్మికోద్బోధనము ధార్మికులకందఱికి తగి, మఱియు సనాతన ధర్మప్రవర్తకులకు సమంజసముగా నున్నది. అతను వ్రాసిన ఈ వ్యాసము గాంచ సంతసం బగును. తన వృద్ధ మధురవాక్యసహిత వ్యాసంబిది.

“ప్రస్తుతకాలమున విశ్వమునం గల అన్ని వర్ణములు వదో యొకవిధముగ ఈశ్వరారాధన గావించుచున్నారు. అది శ్రీకృష్ణభగవానుడు భగవద్గీతలో నుడివినట్లుంది కాని. నూతన పద్ధతిలో కొంతమంది ఆర్యులు పూర్వ పుణ్యపద్ధతిని పురస్కరించెదమని యనుచున్నారు. తత్కారణమును వారి నడుగ ‘మూర్తిపూజ మూర్ఖులపని’ యని చెప్పుచున్నారు. కాని సత్యమును గాంచ ఆరాధన అర్యులపని యని గోచరించును. ప్రకృతము భగవంతుడు నిరాకారుడే కాని, సాకారుడు కాడనియు విగ్రహారాధన కూడదనియు, కూడునవియు మహాత్ముల యుపదేశము. రాక్షసబృందముతో రణమొనరించిన ఏకనారీవ్రతుడగు రాముడు, మఱియు కుబ్జను రక్షించి, శిశుపాలకంసాదుల సంహరించిన శ్రీకృష్ణుడు భగవంతుడు కాడని మన ఆర్యుల తర్కవాదము. మూర్తిపూజ భారతీయులలో యేత్రేతాద్వాపరయుగములనుండి పూర్వులాచరించి నటుల చరిత్రల ద్వార

తెలిసికొనుచున్నారము. అంతియేగాదు శంకర, మధ్వ, రామానుజాచార్యులు మొదలగు మహానుభావుల యుపదేశము కూడ చేయుమనియే. కాని బుద్ధుని యుపదేశము అట్టిది కాదని శంకించవచ్చును. కాని బుద్ధుడి లాగా అయినా తదుపరి అలాగ చేయకూడదు. కాని సంసార సాగరములో మునుగుచు తేలుచున్న మానవుడు తన ఏకదృష్టితో విగ్రహ రూపములో నున్న భగవంతుని ఆరాధించుటకై ప్రాచీనులు విగ్రహముల స్థాపించిరి. కాని నేటి మహానుభావులు దేవళములలో కొన్ని స్త్రీల సౌందర్యము వారి కోమల రూపములను గాంచవలెనని భావములో వచ్చు మన సమాజికులు విగ్రహారాధన కూడదనరు! వారికి స్త్రీ సందర్శన ఆరాధన కావాలి. ప్రమాణమని చేయకూడదని చెప్పి పాపము సభలలో ఛాయాపటములను పెట్టి దండలు వేయుట విగ్రహారాధనకాక పరసారాధనేమో! ప్రమాణాలు కావాలి అంటారు. చూసుకొమ్మను. "విగ్రహారాధన" యను గ్రంథములో తలలో నున్న వెంట్రుకలన్ని దొరుకును.

భారత దేశములో నానాటి సమయమున పాశ్చాత్య దేశమునుండి వచ్చిన కొందరు మూర్తిపూజ కూడదని దుషణను దేశోద్ధారకుల లాగ కొందరి యుపదేశము లంబట్టి ఇంతవరకు కూడ అట్టి పూజ నిర్విఘ్నముగా జరుగుచున్నది.

భగవంతుడు లోకరక్షణకై నిరాకారుడయినను సాకారత్వమును బొంది "ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" ఇత్యాది న్యాయములచే ప్రపంచమున వచ్చినారు. ఉదా:— నారసింహాది యవతారములు. ఇంతియే కాదు, (సహస్రశీర్షాపురుషః) యను సూక్తముచే ఆకారమున్నదనియు వేదప్రమాణము. విద్యుద్దీపమువలెచూపింప. సాకారుడు కాడను పురుషులపుణ్యనామకీర్తనచే నరువందవలయును కాబట్టి భగవంతుడు సాకారుడగు నెప్పుట సర్వవ్యాప్తిత్వము. భగవంతుడు సర్వవ్యాపకముతో నెటులయున్నాడని యడుగుతే. దానికి నాధునికవిజ్ఞానవేత్తల విద్యుచ్ఛక్తితో సరిపోల్చవచ్చును. ఒక కంబమునందున్న స్విచ్చినొత్తితే పట్టణములోనున్న దీపములన్ని వెలిగినరీతిగా భగవంతుడు సాకారత్వమునొందును.

ఈశ్వరుడు ఉన్నయెడల మనకేల కాన్పించడు అని యడుగుతే సూర్యునిచూడలేని గూబకన్నులు అజ్ఞానమనేచకాన్వంతిలో నిండియున్నటువంటి యీచర్మచక్షువులు. నిర్మలుడై సర్వసర్వం సహా చక్రమందు సర్వజనపూజ్యత్వవిశేషములు గలిగినటువంటి, కోటిసూర్యులతో సమానమైన భగవంతుని చూడలేము; కావున, మూర్తిపూజ ముక్తికి సోపాన. సర్వవ్యాపకత్వము భగవంతుని లోహము రాయిని పూజించు టెందులకు! అనియడుగుతే ప్రశ్నకు సమాధానమిది! మానవుని మనస్సు చంచలమైనది; కావున, ఆమనశ్చలనము లేకయుండవలసిన చో, యేరీతిగా

అజ్ఞానదశయందున్న పిల్లవానిని ప్రబోధించునపుడు శృంగారమైన యేబొమ్మనో యిచ్చి బుజగరించినభంగి, మనుష్యుని మనస్సు నిలుచుటకై శృంగారమైన దేవాలయమందున్న విగ్రహమును చూపించుట మంచిదికాని, తుమ్మముళ్లతో ప్రకాశించుచున్న పెరటియందుగల బోడరాయిని దేవుడనిన బాగుండదు. మరల మానవనిర్మితమగు సుందరవస్తువునుచూడగా, దానిని నిర్మించినవాని సంస్మృతికలుగును, అట్టితరి దానిని నిర్మించినవాని చాకచక్యములను కొనియాడుదుము. కాని సుగంధాదిస్థాన పరమాత్మ స్మరణరాదుకదా! అదిప్రశ్నస్త్రీ లోకములో సుందర స్త్రీనిచూచి ఆనందించినపుడు ఆవనితను కన్నతండ్రిని, లేక తల్లియొక్క సంతానచాకచక్యమునకు ఆశ్చర్యపడుగదా! కాబట్టి, మూర్తినిచూడ దానికిసంబంధించిన పరమాత్మ తత్వస్వరూపముగనబడును భగవంతుని విగ్రహరూపముగ పూజించుట యుక్తమమని మహర్షులు కూడా ప్రబోధించియున్నారు. కావున, మానమనస్సు నిశ్చలమై సర్వేశ్వరతత్వమును తెలుసుకొని తద్వార జన్మరాహిత్యమై ఆనందపూర్ణసహితమైయున్న మోక్షమును గాంచవలయును.

మహాశయులారా!

పూర్వమునుండియున్న పురాణములను నమ్మను భగవంతునిపూజింతురు. సనాతనీయమునునమ్మి జ్ఞానచక్షువులం బడయుడు అట్టిధర్మమును యీవ్యాసరూపముగా వ్రాసినవాడ

సమునకు మెచ్చుకొని, తప్పులు ఒప్పులుగ భావించి నాలేఖనిని విరమించుచున్నాడ."

దీనిని చూడ అతనికి సనాతనధర్మములను ఆచరింపవలయునను కోరిక గనుపించుచున్నది. అంతియేకాదు; అధునికశైలిలో వ్రాసి భాషాలోకమున కర్పించియున్నాడు. ధర్మములలో సనాతనధర్మము సారవంతమైయున్నదనువిషయమందరికి దెలిసినదే. మానవత్వవిశేషముచే శుద్ధిబొందిన విజ్ఞానముతో నున్నప్పుడు, ప్రకృతకాలమందున్నట్లు కామ్యారాధన చేయనపుడు, విగ్రహారాధన చేయకుండవచ్చునను ధర్మము పేర్మియుక్తము గానున్నది. ఇటువంటిభావములతో నున్న మారంగడు మహాత్ముడు. అతనుస్థాపించిన సంఘములు రెండు (౧) విద్యార్థిసంఘము. (౨) వైదిక విద్యార్థి సంఘము వైష్ణవ విద్యార్థి సంఘాలోచనాసభ్యుడై, అన్నివిధముల సాయమునర్చి సౌమ్యుడాయెను. అతను వేదికపై నిలుచుండి ఉపన్యసిస్తుంటే ప్రతి వ్యక్తి హృదయముకరిగి అతని ప్రబోధములో, తద్ధర్మాలు అనుష్ఠింపని వ్యక్తియెవరు! అతనన్నివిధముల ఆనందపురుషుడై నివసించుచుండెను. సారసవ్రతనేతృడు నగు నాతంగ రెంతసౌ సౌందర్యవంతుడు.

## నిర్యాణము.

పుష్పలత దినదినప్రవర్ధమానము వృద్ధియై, ఒకానొక

కాలమందుదది నిర్యాణమౌను (వాడిపోవును) ఉదయాద్రిపై భాస్కరుడు ప్రకాశించుచు వెడలి, సాయంత్రమువరకు తనను యుస్తమించును. సుధాంశుడు శుక్ల పక్షమున వృద్ధియవుతూ. కృష్ణ పక్షమందు దినదినము క్షీణించుచు ఒకానొకరోజు మనకు కానుపించదు అల్లాగే మానవుడు పుట్టి పెరిగి యెన్నటికైనా ఈశ్వరునిలో లీనమగును “జాతస్య మరణం ధృవ” అను శాస్త్ర ప్రమాణము మనకు గానుపించుచుండగా చింతించాలసిన పనియేమి? పూర్వులు బోధనము సిద్ధముచేసివుంచ తత్ఫలితము పొందకుండుట మనతప్పుకాని, వేరొకని తప్పుగాదుగదా!

ఋషులు పుణ్యపురుషులు. వారుతలంచినపని తప్పకుండానెరవేరును. ప్రపంచ మొకనిముసములో వారు తమస్వాధీన పరుచుకొందురు ప్రపంచఖ్యాతిజెంది మృత్యువిముఖులై తాపిచిన మహానుభావులుగూడా నున్నారుకదా! వారిలో మార్కండేయుడు, మరియు అశ్వత్థామను యెరుగని వ్యక్తెవరు? మూరంగడు వేసవికాలమందిచ్చటికివచ్చి మళ్లీ సీతాకాలంబాగున వెళ్లెను. వెళ్లుసమయమందు నాతోనిమాటలాడి పోవందున తన మృదుమధుర వాఙ్మయ వాక్యరచనతో, నాకు కొన్ని లేఖలు లిఖించెను. అవియేతుదిమాట లతనివి నావిషయములో. ఈలోపలనతని ప్రఖ్యాతి వృద్ధియగుటచే, నతనిని పాఠశాలాధికారులు “ఉపన్యాసకా” అని పిలుచుచుండిరి. నిశ్వమానః కల్యాణ సంఘముస్థాపించి దానిని ఖండించినవ్యక్తిని మళ్లీ యితను పుర

స్మరించిన పుణ్యుడు. శ్రావణమాసమందు సూర్యుడు ప్రకాశిస్తే అతనిని మబ్బులుగప్పి వేయును. అరీతిగానే మన శ్రీరంగని భానుడనే ఖ్యాతిని. జ్వరమనే మేఘములు గప్పి వేయ సిద్ధముగా నుండెను. ఏముంది జ్వరబాధతో నతడు మంచ మెక్కెను. సహోదరులైన విద్యార్థులు, యింటికిపోదమని బలవంత పెడితే నా పాఠములుపోవును. తిరిగి యిచ్చటికొచ్చుట కష్టమని భావించెను. సత్యమైన విద్యార్థిలక్షణము నిరూపించెను. తుదకతని అత్మమిత్రుండైన "వ్యాకరణశిరోమణి నల్లంతిఘళ్ చక్రవర్తుల తంయ్యాల నృసింహాచార్యులు"గారి సాయమున యిల్లుచేరెను భగవంతుడు పుణ్యపురుషులు జీవించియుండగనే కీర్తిశాపాలని ఇష్టపడడేమో! తీసుకొనివచ్చిన మాతంగదు, ప్రపంచరంగము నందలి శ్రీరంగరంగనాధుపాదారవిందసేవకై, సుభానుశ్రావణ శు॥ పంచమి లక్ష్మివారము సాయంత్రె మూడుగంటలకు సూర్యాస్తమయముతో తనజీవిత మస్తమింపజేసుకొని, కీర్తిశేషుండయ్యెను. మాతంగదికొక వైరాగ్యతోత్రివ చూపించిన సత్తమకాలి. అతనియవతారము చాలించి, శుగ్రంథాంతరిక్షమున చంద్రుడై ప్రకాశించు చున్నవాడు మా రంగడు రంగా, రంగా, శ్రీరంగా! నీకుతప్పక మవశ్యాంతి గలుగును రంగా కెలవు. ఓం శాంతిః శాంతిః శాంతిః



*



# బ్రాహ్మీ (సరస్వతి) తైలము.

ఈ తైలము అనేక ఓషధీసుగంధ ద్రవ్య సమ్మిళితమైనది. దీని ఉపయోగముచే తలవేడి, నొప్పి, నేత్ర ఉష్ణత తగించును. తల వెంట్రుకలు నల్లగా అతి దీర్ఘముగా పెరుగును. ముఖ్యముగా స్త్రీవారు వాడతగినది.

వెల: 1-4-0 వలయువారు:

వి. నరసింహాచార్యులు.

ఆయుర్వేద వైద్యులు, వరంగల్ అనివాత్రియుడు.